అస్మదీయ కంఠమునయం దాడుచుండె
నొక యొద్గీతి బయటికి నుబికిరాదు
వొచ్చుకొని లోసకింబోదు వ్రచ్చిపోయె
నా హృదయ మీ మహాప్రయత్నమ్మునందు.

విఫలిత పునఃపునఃకృతవివిధయత్న
భావిత ప్రచండబాధాతథావిదారి
తాస్మదీయ హృదంతరంబందుఁ దోఁచె
స్ఫురితసంఫుల్ల నవజపాశోణసంధ్య.

ఈ మహాసంధ్యలో శారదామయూరి
రమ్య కింకిణి కిణికిణి రభసపాద
మంజులవిలాస నృత్య సామ్రాజ్యలక్ష్మి
యగుచుఁ గచ్ఛపీ మృదుగీతు లనుసరించు.

౨

ఈ మనోహరవీణ వాయించలేక
చేతమున నెంతు నేనశిక్షితుఁడ నంచు
నా లతాంగి విలోలనేత్రాంచలమునఁ
గదలుచున్నది దాని రాగాల మెరుపు.

ఈ విపంచికమీఁద వాయించుకోర్కె-
ఎంత యున్నదో నైష్ఫల్య మంతవఱకు
తరుముకొనివచ్చె నా హృదంతర మదేలొ
గాఢనిద్రాగతుని నన్నుఁ గలతవెట్టు.

అసలు మ్రోగునో మ్రోగదో ఆ విపంచి
ఏల మ్రోగదు నా దురదృష్ట మనుము

3

ఈ జనసమూహమునయందు నే శరీర
మాత్రముగఁ బోవుచుంటి నా మానసంబు
నమిత తృష్ణాలసం బంతకంత భూమి
మీఁదినుండి స్వర్గానికి మెట్లుకట్టు.

ఏదో నన్ను వెంటాడెడు నెందుకొరకో
అగునో జన్మాంతరమ్ములయందుఁ జేసి
నట్టి సంస్కారలేశము ప్రాణములకు
వేచుకొనియున్న యాశయేమో చివరకు.

౪

నిలుకడ యెఱుంగని వనాంత నిర్ఝరంబు
రీతి నా భావ మీ శిలాదృతపథంబు
ననుసరించెడు జలజల ననుచుఁ బొంగి
ఒక్కబొట్టైన మిగుల దేమో చినుకు.

ఈ నిశీథిని నా చిత్త మెంతొహాఁగ
మరిగియున్నది తాఁగఁ లద్దునఱను
నవతలే మున్న దను ప్రశ్నె యడిగినాను
నవ్వుకొన్నవి తారకల్ నన్నుఁజూచి.

౫

నాకొఱకె పంపఁబడియొ నీ నవ్య హేమ
మధుకలశమైనఁ గాని నా యధరబింబ
మెఱుగదా స్పర్శ నగచు చే నిట్టు లుండఁ
గ్రాగి నీరగుచున్న దా కలశమధువు.

అచ్చమా మహదానంద మనుభవింపఁ
జాల దీ శరీరము బాధ సమ్మిళితము
కావలయుఁబోలె నున్నది

౬

ఈ మరందసమ్మిళిత మ దేల యచ్చ
మైన విసమునె తెమ్మ యీ మాసని యది
క్రోలగలడుసుమీ కాలకూటవహ్ని
కలిత మటవె రత్నాకరగర్భసీమ.

ఈ భవత్రోత్థ లజ్జారుణేక్షణముల
మొగము నాయది, కనవచ్చె ముక్తసంగు
డైనవానిదిబలె నప్రయత్ను డైతి
నైహికాముష్మికముల మధ్యమ్మునందు.

అరుణ దృషదాభ నిష్కృపాపాంగకిరణ
భిదుర శతధా వినిర్భిన్న హృదయశకల
ములను గూఢమనఃపాత్రమున నమర్చి
పశ్చిమాశాముఖుండనై పయన మైతి.

౨

ఈ లలితసృష్టి యేమొ యీ పాలకడలి
యందుఁ గెరటాలు లే వఁట యిందు నెంత
వలపు నేగిన హృదయంబువలెనె గాసి
పాలు పొంగవటే యెంత బాలునకును.

ఈ లలితసృష్టి యేమొ యీ పాలకడలి
యందు జలజంతువులు లే వఁటేనగాని
పాలు తిండిగఁ బెరిగెడి ప్రాణులైన
నెదుగునో యేమి చిత్రమో యెవ్వ డెఱుగు.

ఈ లలితసృష్టి యెట్టిదో యింమమీఁద
బాపసెల్లా పరచి నిద్రపట్టుకున్నఁ
బట్టినట్టు నటించఁ బాల్పరచు నటవె
ప్రథిత యోగ్యాంతరంగేశు పద్మనాభు.

౮

మొదటిసారి నా యెడఁదలో ముల్లు నాటఁ
బడి మహాశూలములనుబోలె బాధపెట్టె
దేహము భరించుటయు కష్టమై హృదంబు
రాశి బాడబవహ్ని పరాక్రమించె.

అది మొద లనంతములుగ నిందు దిగఁబడిన
శూలములు ముళ్ళవోలిక సుంత బాధ
పెట్టి యంతట శాంతించు వెనుక ముల్లు
కలఁకిడిన నంతగా బాధ కలుగబోదు.

ఇంకఁ గొన్నాళ్ళపునయేని యింతమాత్ర
మైన బాధయుఁ గలుగనియట్లు తోఁచు
నప్పుడు నిశాతబాణము లయినగాని 21
యెదపయిన యోగ్య మగు నేమొ పదునువెట్ట.

౯

అప్పటికిఁ జిన్నవాఁడ ననంతమైన
యీ హృదయశల్యబాధ నే నెఱుగ నసలు
తిరుగుచుంటి మధుస్రవంతికల లోనఁ
బొరలుచుంటి మొయిళ్ళ గుంపులకుఁబైన

అతి విచిత్రమ్మయగు సప్న డది తలంచ
నే నొక వనాంతరఘురమున నీవు లాడు
చప్పుడొక పాటపాడితి నందులోని
యర్థ మిప్పటి నా స్థితి కతికిపోవు

ఈ సరీధిని నాచిత్త మెంతదూర
మరిగియున్నది తారక లడ్డువటకు
అవత లేమున్న దస ప్రశ్న యడిగినాను
నవ్వుకొన్నవి తారకల్ నన్నుచూచి.

## ౧౦

ఇంతలోన వికాసమ్ము లింతలోన
మీలనమ్ము లీ శ్రావణవేళఁ బ్రొద్ది
శాగగనలంబి నీరదచయముతోడ
నా మనోవికాసనిమీలనములు వోలుచు.

నికష దృషదగ్రమునఁ దపనీయరేఖ
వలె జలదగర్భ విద్యుత్ప్రభల్ గనుఁగొని
నేను స్మరియించుచుంటి వినీలమైన
ప్రణయినీ నేత్రముల సితాపాంగరేఖ.

సాంధ్య నృత్యదీశ్వర మురజమ్ము వోలె
గర్భఘూర్ణిత మంధరగర్జఁ బోలుచు
నీ జలదమాల చూచి నా హృదయమందుఁ
బ్రణయ మధురగీతమ్ములు బాహిరిల్లు. ౩/

౧౧

ఆతఁ డొకవీణ నిచ్చె నా కది సజీవ
మా విపంచిక శ్రుతులందు నమృత మున్న
దది నదించిన నా దేహ మమృతఖండ
మది నదించద నా దేహ మవనిధూళి.

నా పురాకృతపాప మేమో పలుకద
యా విపంచిక నే నెంత యార్తిపొంది
దాని తంత్రులు మీటిన దానిపై నఁ
బట్టలేనంత కోపము వచ్చి నాకు

శిథిలమైపోవనీ విపంచిక యటంచు
విసరివైచితి దానిఁ బృథ్వీతలాన
నపుడు తెలిసెను నాయాత్మయందు దాని
తీవ్రఘాతమ్ము వచ్చి ప్రతిధ్వనించె.

౧౨

ఈ కెలన శరత్పూర్ణిమాసృతశశాంక
లలితరోచిర్వితాన మా కెలన ఘోర
ఘనతరాంధకారచ్ఛటాక్రాంతభూమి
అందు సగ మిందు సగ ముంటి నవుర నేను.

ఈశరత్పూర్ణిమా చంద్రికా సుధా వు
రీచిలో నున్న నేను స్ఫారీభవన్న
వీనశంపాలతాకృతి పూనియుంటి
ఈ సగము నాకు నాకె కన్పించఁబోదు.

ఉగ్రరాహు చంద్రార్ధబింబ గ్రసనము
వోలె నున్నది నాస్థితి.

౧౩

స్నేహపూరితమైన నా చిన్నప్రమిద
లోన నెంత యత్నించి వెలుంగ లేకు
న త్రి యతిపునీతమ్మైన పైడిప త్తి
అస్మదీయ మహాభ క్తి యపరిమితము.

ఈ ప్రదీపికాకాంతి దిగిభ సమూహ
గండఫలకంబులం దలంకార చిత్ర
వల్లులై వెల్గు నని లోన బ్రమసిపోతి
నకట దీపిక మొదల నంటుకొనదాయె

అంటుకొనె నేని యీ దీప మణిశయిత ర
సాతలోత్ఫుల్ల ఫణిఫణాచ్ఛవి వినూత్న
ఘన చలద్రత్న మగుచు శిఖావితాన
కాంతిచయమున నూర్ధ్వలోకములు ముట్టు.

౧౮

అమృతమూర్తి ప్రేయసి వదనాంచలమున
మందహాసోదయం బగుమాడ్కి నాదు
చిన్ని పూదోఁటలోఁగూడఁ జివురులెత్తె
నీ వసంతప్రభావమ్ము నేమిచెప్ప?

ఈ పువుందీవబోదెలో నిల్లు కట్టి ముడుచు
కొని భుజగమనై నిదురవోఁ గోర్కిగలదు
ఓలి సొగసు నా ప్రియురాలివోలె నీ ప్ర
సూన వనలత నాకు శుశ్రూష చేయు.

౧౫

ఇది మహాగ్రీష్మఋతువు నా యీ శరీర
ముడికిపోయెదు నాలుక పిడచకట్టు
రమ్యమాకందపత్రతోరణము లున్న
నీదు చలివేంద్రలో వచ్చి పిలచినాను.

ఒడ్డు లురలిన యమృత మోహా! అయోగ్య
మీ శరీరమ్ముపైఁ బ్రవాహించినావు
ఈ భవతప్త జీవవాహినియ యన్ము
నా ఘటము కాలశిఖరభిన్న మగుదాక.

అట నదృశ్యమ్ము యగు ప్రవాహమ్ముచోటఁ
బోలములై భావిసమయ లాంగలము తగిలి
యీ ఘటవిభిన్న శకలము లేమిభావ
ములు కృషీవలు హృదయసంకులము లగునో.

౧౯

ఈ విలాసాధిక జ్యోత్స్న మెండ మండి
పవలు తొలిసంజ రేకలు పర్వినంత
మధుర సీమంతినీ చారు మందహాస
వాసనలు చిమ్ము వెన్నెలల్ గాసె బళిర.

చూచుచుండ విలాసపు చూపు లొదవెఁ
గన్నుగవ చిట్టచివరి భాగములయందు
సాంధ్యశీతలమైన యీ చల్లగాలి
ముద్దు టిల్లాలి నర్మోక్తి ముస్మరించు.

కడు విలాస మీ వెన్నెల కాల్వలందుఁ
దేలియాడు తరంగ వీథికల నడుమ
నా ప్రణయ భావరాజహంసీప్రయాణ
మమృత మాధుర్యపుం ద్రోవలంటి నడచు.

౧౨

చరమశీతల మగు దివాచ్ఛాయలందు
నీ నడక కొంచెమ్ముగ స్పష్టమైనయదియ
ప్రణయసూన పరిమళవ్యాప్త దేహ
కృత కుతూహలులము పులకితుల మేము.

ద్రుతదినాంతసంధ్యా నటల్లోకనాథ
చరణజసత రావమ్ములు గిరులుకొన్న
నీ యురుములోనఁ గలసి ధ్వనించుచుండె
మా హృదంతరమ్ములు నీలమసృణమూర్తి. *

ప్రణయినీ నీల నీరజాభముల కనుల
కాటుకయుబోలె గగనమ్ము క్రమ్మియున్న
నీ గొడుగునీడల నొదిగి నిలచినాము
శైత్యముగ్ధప్రభూ! నవాషాఢజలద !

౧౮

ఆ జగదతీత తేజోవిరాజమాన
మైన నేత్రాంతరమ్ముల నరసి యరసి
కొన్ని జన్మంబులకు మున్న నన్ను నేన
చూచుకొంటిఁ దత్సంయోగశుద్ధశీలు.

ఆ ప్రణయ దివ్యశయ్యపై నవధరించు
రంగనాథుఁడ నూహకురాని సుఖము
లేమొ యని చూచులోనఁ ద్రపామధురిమఁ
గలఁగి చూపు నైశ్చల్యంబు గలఁచినైచె.

ఏ నోఁక సమీరకబాలుఁడ నీ ప్రసవము
నాకు సమభాగినిగఁ గూర్చినా డతండు
మా పరస్పరమ్మును స్పర్శమాత్రమునన
పులకిత బ్రహ్మపథమునఁ బోవఁగలము.

ఈ యనంతపథమ్మున నెంతదూర
మరుగుదుమొ మాకె తెలియని దది, తలంపు
నందగారాని కడల సంధ్యాసమయపు
టరుణరోచులలోన వాహ్యాళి మాకు.

ప్రాగుదిత చంద్రబింబముపైనఁ దరక
కట్టినటు లున్న క్రొత్తమేఘంపు తునుక
మమ్ము రమ్మను చున్నది మాటి మాటి
కచ్చటికి మేము నేఁడు ప్రయాణ మగుట.

౨౦

నేను పసివాడ నప్పుడు సత్య బాల
లీలకొఱకు నొక్క గులాబి పూలమొక్క
నాకుఁ జూపించి యిది నీది "నాయనా" య
టంచు నా యేదు పుడిపె మా యమ్మ దిద్ది.

అదియ మొదల లా గులాబిమొక్కన్న నాకు
నాది యనుభావ మేలనో నాటుకొనియె
నల దిగంతమండలి మహదంకురములఁ
బిలుచుకొనివచ్చి దానికి వీనఁ జేతు.

ఆ మొలకగూడ దైనందినాభివృద్ధి
పొంది యొకనాఁటి ప్రొద్దునఁ బూవుపూచె
అందులోని తుషారమ్ము లమృతధునుల
టనియె మా యమ్మ తన కది యాయు నంట.

౨౧

నేను నీరమ్ము నామె 'ధుని' యిరువురము
పోయిపోయి చొచ్చితిమ యంభోధిలోన
నంబుధియుఁగూడ తానె మే మన్నయట్లు
గౌరవముచేసి తనలోనఁ గలుపుకొనియె.

౨౨

అలసి యీ నిర్ఘర తటంబునందు నేను
విశ్రమించితి వనదేవతాశ్రమమున
నామె యాతిథ్య మొసఁగి నా కమృతమైన
యీ ప్రసవ మిచ్చి నన్ను రక్షించు మనియె.

అది యనుభవింతునా వలదా యటన్న
సంశయ కృశానుకీలల సమసిపోయి
దృఢ వినిశ్చయచ్యుతుఁడ నా దివ్యసుమము
వాసనలుచూడనే చూడఁబడియె ననుము.

అది మొదల యీ ప్రసూన మంతంత వాడి
వత్తలై పోవుచున్నది వనరమ యరు
దెంచి పూవునుగూర్చి ప్రశ్నించునేని
యే మని వచింపవలయునో యెఱుఁగరాదు.

౨౩

ఇర్వురమును బ్రయాణమై యేగియేగి
చంద్ర బింబమ్ములోఁ జొచ్చి చనుచు నందు
నొక విసర్గ్నల స్ఝరరిణ్యోజ్జ్వలాంబు
నిచయపూరమ్ములందు మున్గితిమి పోయి.

ఆ ఝరిణి యెందు పుట్టెనో యని యెచటికిఁ
బోవునో యని సంశయంబులు ఘటిల్లి
యిర్వురము నిఱువంకల నేగినాము
ఎంత వేగినఁ దుద కానిపించలేను.

పోవుచుండ నే నొక నీటిబొట్టు నయితి
ఆపయిన గొన్ని నాళ్ళకు నంబుకణమొ
కందు నను చూచి 'నదిమొదల్ కానిపించ
లేదని' వచించె నది పట్టలేను నాను.

ఒక విచిత్రమ్మయైన స్వప్నకథ నీకుఁ
జెప్పె దన అది ప్రళయనిశీథ మంట
పొంగిపోయి సముద్రాలు భూమియెల్ల
బుసబుసని నుర్వులో మున్గిపోయె నంట.

నాల్గుదిబ్బలు మిగిలియున్న వఁట యందు
నల్వురము నీవు నేనును నా జనకుఁడు
నా సఖుఁ డొకండు నిలిచియున్నా మఁట ప్రళ
యాతిభీకర మఁట గగనాంగణంబు.

ఇంతలోఁ జూడ మిగిలినా మీవు నేను
నిఖిలవర్ణాతి భీకర స్నిగ్ధము లగు
ప్రళయ మేఘకాంతులను గన్పడియు నీవు
కన్పడవు తుద కేన యొక్కఁడ మిగిలితి.

౨౫

అమృత నిభృతమ్ములైన నీ యక్షులందు
నఖిల విశ్వము నవుర! నా కగపడు నటె
ఈ విశాలమ్ములయిన నీ యీ విలోచ
నములలోనఁ బ్రతిఫలించె నా హృదయము.

ఈ మహావిశ్వముఁ బ్రతిఫలింపఁజాలు
మన యనంతత్వ గర్భిత మధురభావ
ధునికి జన్మస్థలంబు నా తనువు నిదియు
నా జననిగర్భమున కల్పమై జనించె.

అస్మదాదిక రేణుసహస్రములను
దన మహాగర్భమునయందుఁ దాల్చియున్న
ఆయమ యనంతమూర్తి నా కనవగతము

౧౮

ఈ ప్రణయపయోరాశి మథించినాను
ఆశ కవ్వపుగిరి మనస్సహిపతిగను
తరచి తరచి బలమ్ముల్లఁ దరిగిపోయె
తరచి తరచి భుజమ్ములు విరిగిపోయె.

ఆ పయోరాశిలోఁ ద్రిలోకాతి భీక
రముగ విషవహ్ని హాలాహలము సముద్భ
వించె నది యోర్పుగలిగి దేవీ గళమ్ము
నందు నిలిపితి నేను జ్ఞానాకృతి నయి.

అది గళమ్మున నిలిపినయపుడె నీవు
నేను నొకటైతిమే పురంధ్రీ! శశికళ
సాంద్ర శిశిరముగ్ధ సుధారసస్రవంతి
మన శిరస్సులఁ దాండవించెనె లతాంగి.

౨౭

ఏ నొక ప్రవాహగామిని యీది యీది
మొదలు తుదలేని యీ మహాంభోధియందు
నొక సముచ్ఛ్రితశైలతుంగోర్మివలన
నీ యుదారతీరమునకుఁ ద్రోయఁబడితి.

దివ్య జంబూనికుంజ ప్రతిహతరయము
లగు ధునీమతల్లీ తరంగాశ్వసితము
లైన యీ భూమిఖండములందు నీవు
నాకుఁ గన్పించితి సుధా రసైకమూర్తి.

మఱల నీదగఁబోయిన మనలఁజూచి
శరధి శాంతతరంగమై స్వచ్ఛవారి
శిఖర డిండీరసౌధ సుస్థితిని జేర్చి
లాలనము చేసెఁ బొత్తు బాలలవిధాన.

౨౮

ఇచట నొక పెద్ద యంబుధి యచట నొక్క
పెద్ద యంబుధి యీమధ్యఁ బృథ్వీమార్గ
మది ద్విపార్శ్వంబులందుఁ దారాధ్వనికష
శిఖర మగు వృక్షతతిచేత శీతలంబు.

ఆ పథమ్మున నీవు నే నరుగుచుంటి
మస్మదీయాననాబ్జంబు లమృత మధుర
ముగ్ధ దివ్యగీతములచే ముఖరితములు
పథ మతి సుగమ్య మయ్యె నీ పరమకరుణ.

పార్శ్వశాయాత నృుడు మందపవన ధూత
మైన యీ తరు పుష్పంబు లంజలిగొని
సాచి నవ్యస్మితాకృతి వేచియుండె
నమృతధుని! యపాంనిధి మన యాగమనము.

౨౯

నే నొక ప్రసూనమాలఁ బూసితిని జేత
నా ప్రీతిసుమంబునందు నే ననఘళింతు
గ్రథితములు ఇందు వరుసగా కౌరకములు
కోరకములు కుట్మలములు కుసుమములును.

మొదటి మొగ్గలు నీ కృపాముగ్ధ దృగ్గ
భస్తి యెరుగమి వికసించి పరిమళించ
వచటివి భవత్కృపాలోకనాశచేత
నర్ధవికసితమ్ములు తుహినాంశువదన!

ఈ చివర గ్రుచ్చఁబడిన పూ తెల్ల విరిసి
నీ వదన చంద్రమండల నిస్రుతామృ
తాభిషేచనమునఁ జేసి యాశలందు
ధృత మధుస్రుతిఁ దేంట్ల కాతిథ్య మిచ్చు.

౩౦

ఈ మహావకాశమ్మునం దిచట నేను
అచట నీవును నిలచి మోహన దృగంత
మాలికా ప్రసారమున నీ మధ్య నున్న
సీమ పుష్పమయమ్ముగాఁ జేసినాము.

ఒకరి నొకరము కలసికో నురికి యీ ప్ర
సూన పూర్ణావకాశమ్ములోనఁ జొరఁగ
నిర్వ్యగమును పుష్పాకృతు లెనసి లుప్త
భిన్నరూపులమై విడంబించినాము.

తెలిమొగిలు గుంపులోని నిగ్గులవితాన
విరిసిన యచంద్ర చంద్రికా విమలరోచు
లొలసి మనపైన నొక్కరి నొకరిలోన
నీ పవనచంద్రికలు గ్రుచ్చి యెత్తుచుండె.

౩౧

తూర్పు కనుమల వరుస చంద్రునకు దాకు
శిఖరముల చాలుతో సుధాసిక్త మయ్యె
నా శరీరమ్ము సిక్త మైనది భృశమ్ము
అస్మ దారోహణావరోహణములందు.

అమితవేగాన గిర్యుపత్యకము లెల్లఁ
గడచిపోవుచు శిఖర శేఖరములందు
శిశిర నవమంజుల స్పర్శచేత సొలసి
యమృతమూర్తిస దస్మయత్వము భజింతు.

ఇన్ని శిఖరంబులందున నేగి యేగి
యీ మహాస్వర్గ సుఖ మేలొ యెఱుగలేన
ఉన్నతోన్నత మీ శిఖరోజ్జ్వలాగ్ర
సీమ శశిలోన నీవు తోఁచితివి నాకు.

౩౨

సూర్యుఁడను నేను ప్రాగ్దిశా సుందరీ ము
ఖారవింద సుందరతిలకాకృతి నయి
యుదయ మందితి నాకోస మెదురుచూచె
విడిలురేకల నీప్రొద్దుపొడుపు పూవు.

ఓ దయాస్తనగంబు స్వీయోజ్జ్వలిత పి
శంగవర్ణ సుందర దళచ్ఛవులచేత
నామెయును ముగ్ధశిశిర కరాలి నేను
ఒకరి నొక్కర ననుసరించుకొనినాము.

మా పరస్పరాలోకన మధుర దీర్ఘ
రమ్య సుందరాపాంగ సూత్రములచేత
ననిలపథములఁ దేజోమయమ్ములైన
ముళ్ళుపడెఁ బృథివ్యాకాశములకు నేఁడు.

33

ఈ సుధార్ద్రశాఖానది యేను కలసి
కొన్న యీయెడ గుఱు తిడికొన్నఁగాని
ఆ పయిన నేన ప్రవహింతు నధికమూర్తి
నామె యే మాయెనో తెలియంగరాదు.

వేగ మాగి శాంతమ్ముగా నేగుచుండ
నేను శారద స్వచ్ఛ విజ్ఞానమూర్తి
నామె నా యట్టియడుగున నణఁగియుండఁ
బోలు చిక్కణశ్యామ జంబాలమూర్తి.

జలనిధి ప్రాంతమద్విపార్శ్వములయందు
బంగరుం బచ్చకంకెలు వదలి సొగసు
చాలుకట్టిన యీ రాజనాల పైరు
నందు నామె ముమ్మూర్తుల నవఘళించు.

౩౮

ఈ నవవసంత సమయ మి ట్లేగుదెంచి
చిఱుత పువ్వుఁదోఁట లెల్లలఁ దిరుగు ప్రణయ
ముగ్ధమూర్తిని మత్పదాంభోజములను
వికసిత సుమాతిథేయ మర్పించెఁ జూడు.

యుగయుగాల వసంతపుటొఱపు లెల్ల
దాచికొని భావి మధుసుసౌందర్య చిహ్న
గర్భితమ్మైన యీ సుమకాండము లివి
దివ్య యౌవనవతులట్లు తేజరిల్లు.

అతిథేయమ్ముగా లబ్ధమైన యీ సు
మప్రకాండమ్ము సమకూర్చి మాలఁ గ్రుచ్చి
ఇది భవత్కంఠసీమ నర్పించినాను
నీవు ధ్రువమండలంబున నిలచినావు.

౩౫

నీ నిజస్వరూపమ్ము ధ్యానింప నెంచి
విశ్వ వస్త్వంతరమ్ముల వెదకి వెదకి
కొసకు నా హృదయాంతర కోటరస్థ
మైన సూక్ష్మాకృతిని నిన్ను నే నెఱిఁగితి.

నేను ప్రాపంచికముగ ననేక కార్య
లగ్న హృదయుండఁ బోలె నెల్లరకుఁ గానఁ
బడుదు నే కాని దేవి! నా భావ మెప్పుడు
నిత్యలగ్నంబు నీ పాదనీరజముల.

౩౬.

నీ వియోగ మ్మటంచు నే నిక్కువముగ
నెఱుఁగనే యెఱుంగను నాదు హృదయసీమ
నీ వకృత్రిమభావనా నిశ్చితాత్మ
వెల్లపుడు మూ_ర్తికట్టితివే యటనుము.

ఇది యెచటనుండి వచ్చిన దీ వియోగ
వహ్ని యెచటి దీ సంయోగభావశాంతి
దేవి! నీ గీతములు పాడి దివ్యమైన
నీదు సంయోగసుఖవార్ధి నీదుచుంటి.

ఎపుడు నీ పాటలే నాలపించలేనొ
రవులుకొనును నాదు హృదంతరమునయందు
నీ వియోగాగ్ని యపుడు.

32

ఈ పవిత్ర కార్తికిక సంధ్యాపదముల
నోలయు జగతాతపములఁ గృతోపవాస
కార్శ్యమునఁ దూలిపోయి నాకాళ్ళు సాంధ్య
నృత్యదీశ్వరు నివి తలపించు నెటులు.

ఈ పవిత్రి సంధ్యాకాలన్నృత నవారు
గాంశువులు శశక్షతజ రమ్యములు నాదు
మేనఁ జందనమునుబోలె మెత్తఁబడియెఁ
గనులు నాయవి నిప్పుకల్ గ్రక్కుఁ దొడఁగె.

భవ మహాపూజఁ దన్మయభావమందు
నాపయిన నీ కటాక్ష సంతానలహరి
ఇంతి! నీవు దోసిళ్ళతో నెత్తిపోయ
శివ శిరఃప్రదేశకృతాభిషేక మయ్యె.

౩౮

ఈ యుషఃకాల శీతవాతోర్మి లేచి
కృష్ణవేణ్ణా సరిత్కుల్యఁ గృతసమజ్జ
నాతిధౌత శరీరులమై శివార్చ
నోపవాసవ్రతం బూని యుండి మనము.

భుక్తపూర్వాహ్ణవేళకుఁ బోయి భక్తి
మోసులెత్తఁగ నా సంధ్యముగఁబొనర్చి
నట్టి శైవ మహాభిషేకావసాన
మునను గర్పూరహారతి పూనినాము.

ఆ మహాఖండ హారతియందు దీప్త
మైన యిలువేల్పు విశ్వేశ్వరాచ్ఛలింగ
మందుఁ బ్రతిఫలించిన మన యాకృతు లివి
అర్ధనారీశ్వరభ్రాంతి నావహించు.

౩౯

ప్రాతరమృతనిష్యంది నీరజమృదుతర
నవ్యతనువల్లి నిండఁ జందన మలంది
మద్భుజాశ్లేషితాంక సంవలితమగు గ
ళమ్ము కాలాగురుకళంకితమ్ము చేసి.

కమ్రకస్తూరికాతిలకమ్ము దిద్ది
ఫాలసీమ, బంగరు చంద్రవంక పొదిపి
దీర్ఘ రమ్యసీమంతవీధికఁ గనులను
గృప విభూతి రేఖలను దీర్ఘీకరించి.

నీ యెదుట నిల్చి నిన్ను ధ్యానించుచుండ
మార్గశీర్షపు భూధ్రప్రమాణమైన
మంచు మత్తనూవల్లి కాంచలముల
మసలుచున్నదిసూవె సంబాధవోలె.

౪౦

ఈ నిభృత పవిత్రైకాదశీ నిశాప్ర
శాంత శ్రీకాలనాథ పూజాసమయము
లందు ముఖమండపమునందు నందదీవలె
నా ప్రదీపము వెలిగించినాను నేను.

ఇవియుఁ జెంగల్వ మొగ్గలో శివకషాయ
పులకిత జటాగ్రశేఖరమ్ములో ప్రదీపి
కలు శివాలయముఖ గృహాజ్వలితములయి
దివ్యతారక లన్న భ్రాంతి కలిపించు.

అస్మదీయ ప్రదీపికాభ్యంతరమున
ప్రజ్వలితమైనయది పరబ్రహ్మదీప్తి
దేవి! తావక కరుణాప్రదీప్తివలన
నీ సమాగతేతరజను లెఱుకలేక.

౪౧

నీ పయినఁ బాడినట్టి నా నిభృతగీతి
పాడుటయె పరమార్థ మ్మా పైన దేవి
అందుఁ బ్రత్యక్షరమ్ము నీ మందహాస
బాల చంద్రాతపములలోఁ బ్రజ్వలించు.

బాలకులు మూగి వెన్నెల వత్తికొరకు
శ్లక్ష్ణ దృష్టులు వెదుకాడు చందమునను
ముగ్ధహృదయులు నా మిత్రములు మదీయ
గీతికార్థమ్ములకు వెదకెదరు దేవి!

౪౨

అల్పబుద్ధు లజ్ఞాత దివ్యాస్మదీయ
భావ లీ దురదృష్ట దేవతలు వచ్చి
ముగ్ధహృదయుండనైన నన్ మోసగించి
నా హృదయగీతి లాగుకొన్నారు దేవి!

విమల మృదుగీతి వైఖరుల్ విస్మరించి
విస్మరించిన దిగులులో వేదురునయి
మత్ప్రరాగీతికాంచల మార్గములను
దిరుగుచుంటి నున్మత్తుని కరణి నేను.

భవదనంత భావములఁ ద్రిభాగశేష
మైన యీ దీర్ఘ హేమంత యామినులను
గలతనిద్దురలో స్వప్నకలనచేత
నీవు సాక్షాత్కరించుచుంటివి లతాంగి.

పృథివియంతయు నీ పాదపీఠముగను
నలవరిచి యనంతాకాశ మావరించి
అసల వీచికాస్తంభన మాచరించు
నిన్ను సేవించుచుందు రగ్ని వరుణులు.

౪౪

ఈ గవాక్షంబునుండి నాపైఁ గవిసిన
యీ యుషారేఖ లివియు మత్ప్రేయసీ ప్ర
భాతవేళా శిశిర ముగ్ధపంకజాత
మృదుకర స్పర్శవోలె నన్ మేలుకొల్పు.

మీలితాక్షుఁడనై సెజ్జ మెదలుచుండఁ
దెలివిషాలముల సొగసుటెల్లలకుఁ దగిలి
నా మనసు నేదో యొక్క యజ్ఞాతపూర్వ
మైన యనుభూతి కలిగె నా యంతరాత్మ.

అనిమేషార్ధమున భాసమయ్యె నాకు
గతవిభావరీ సుఖదుఃఖఘటన లెల్ల
స్వాప్నికము లని సత్ప్రకాశమున నింకఁ
బోదు నస పులుగడిగిన ముత్తెమట్లు.

౪౫

ఈ ప్రణయగీతి చిత్రమే యేరితోడ
నైన నే నుండ దగ్గరకేనిరాదు
నాదు నేకాంతమునయందు నన్ను మరుగఁ
జేసినది హావభావ సుశ్రీలచేత.

ఆ మధురగీతి నేను నేకాంతగోష్ఠి
నున్నయప్పుడు నీవురా నొక్కయింత
కొంక వా గీతిసతి తప్పాకోమలాత్మ
అది మనము సర్మగోష్ఠి నున్నప్పుడు రాదు.

౪౬

అమృత తీర్థంబునం గ్రుంకులాడఁబోయి
యీదనుక దేవి నీవు రాలేదుచూవె
నీకయి శశాంకమృదుయామినీపరీమ
ళానిలములలోఁ జూచుచున్నాను నేను.

రంజితాధర తాంబూల రక్తిమంబు
చిఱునగవు తెల్లదనములోఁ జిటిలిపోవ
నెదురుగాఁ దోఁచి నాకు నందిచ్చినావు
చిన్ని శిశువునుబలె తీర్థసేవఫలము.

అరయ నందీశ్వరుని యీష దంకురిత వి
షాణయుగరమ్య మూర్ధ దేశంబువోలె
హైమజలదంబు కొసలఁ గోరాడుచుండి
చల్లనయ్యె మాయెడల నీ చంద్రరేఖ. ౧

౪౭

ఏ దెసనిమిదేండ్ల కూకటు లెదుగరాని
కుఱ్ఱవోలిక భావముగ్ధుఁడను నేను
ఎప్పు డేని నముగ్ధుడ నేని యితర
జనుల సంఘర్షణ ప్రతిచ్ఛాయ లవియు.

కాదయేని చేమంతి ఆఘ్రాణయోగ్య
మైన సన్నుఁ జుంబింతు నేలా! విలాస
మొలుకు ననుఁ జూచి యానంద మొందలేక
చెలువు టెక్కుల విడిలఁదీసెద ని దేల.

౪౮

నీ వసంతభావాలయవై విశాల
భావసామ్రాజ్య మేలుచున్నావు దేవి!
నీ కృప నదెంత భావమేసియును సుపరి
చితమ యట్లులఁ దోఁచు నా చిత్తవీధి.

ఈ ప్రణయ భావగీతము లివియు నీ కృ
పాతిశయమునఁ బూవులేనట్టిచోటఁ
దావియును క్రొమ్మొగిలులేని తావునందు
శైశిర పృషత్పరంపరల్ సంతరించు.

౪౯

శ్రీదమై శాంతమై నమీచీనమైన
యవ్యయపదంబు నందు సింహాసనమున
నీ వధష్ఠాత్రి వేలుచున్నావు కమల
పవనములు వీచు నీ పదాబ్జములనుండి.

అకట! కామాదులైన యీ యారు పర్వ
తములు వచ్చినవే వచ్చుదారికడ్డ
మిన్నదినములుగాఁ బ్రయాణించుచుండి
యవ్యయపదంబు పొలిమేరలైనఁ గనక.

౫౦

ఇవి మహామోహపుంభూము లిచటనుండి
ఏవిధకష్టంబులు ననుభవించినాడ
అచట ముక్తి పొలాలు సందెచటఁ జూచి
ఏను సుఖాలె పరిమళించినవి భృశమ్ము.

ఎంత యెంత కష్టమ్ములకేని మొఁగ్గి
ఎన్నిమోహాలనైన జయించినాడఁ
బూర్ణయత్నమ్ముచేసి యీ ముక్తిపొలము
గట్లుసైతమ్ము కొంచెము గదుముకొంట.

ఇరులు గ్రమ్మ నీప్రొద్దున మఱలఁజూడు
గసుముకొన్న ముక్తిపొలాలు వదలిపెట్టి
గెలుచుకొన్న మోహాల నేలలకు వంగి
అకట! సాలోచనాక్షుఁడ నైతి నిట్లు.

౫౧

అతివ! యీ కుండ మూది సత్యాగ్నిహోత్రి
నైన నాదు కర్మిష్ఠిత కగు సహాయ
పడెద వీ పొగపోయి నా పలితనేత్ర
కోణములు జ్యోతులై వెలుంగు గృహలక్ష్మి!

వచ్చిన వసంతమల్లికా ప్రసవదామ
ములును మంచిగంధమ్మంజలుల ఘటించి
ఆహుతిగఁ జేసితిన యిమ్మహాగ్నియందు.



కనుగొనినవారు నను వసంతుని సుమాస్త్ర
గుడిచి యజ్ఞదీక్షితుఁ డనుకొనిరి గాని
గేస్తురాలవు నీవ యగ్నిసమకూర్ప
నగు నిజానికి కర్మిష్ఠి నని యెఱుఁగరు.

౫౧

పగలె రాతిరివలె తమోభయదమయ్యె
గగన భాగగర్జిత మేఘ ఘటలవలనఁ
గురియుచున్న వర్ష మ్మిది కురియుచుండె
నేగుచున్న నే నిట్టుల యేగుచుంటి.

పటపట పెగుల్చుకొని నేలపైకి దుమికె
నేమొ యా మిన్నులచ్చోట నీ శరీర
ముత్పులకమయ్యె నే నుఱ కూహసేతు
పిడుగ దెట్లుండు నాపైనఁ బడునయేని.

ఆర్ద్రవసనాంత పిహితోత్తమాంగుఁడైన
యేను నభిసారికంబలె నేగుచుంటి
నా చను ప్రశస్తపథ మెచ్చటో

౪౩

ఈ విలయవాత వర్షపాతావసరము
పూర్వ కార్తాంతికాదిష్టమును సుదీర్ఘ
మైన మన జీవితంబున యందు సంది
యములు కలిగింపఁ బడుచుండె నమృతమూర్తి.

ఈ విలయవాత వర్షపాతావసరము
నందు మన పురాకల్పితమైన ప్రణయ
సౌధ మట్టిట్టు కదలి భూస్థలిఁ బ్రపాత
మగునో యను సందియమ్ము న న్నావరించు.

ఇతడు విలయాధినేత కాదే శశాంక
మౌళి యీ దేవదేవు దివ్యాలయమున
నాంది పీఠముకడ భావనా ప్రకల్పి
తాస్మదుభయమూర్తిగ సమర్పాత్ముఁడైతి.

ఈ పయోధితరంగమ్ము లింతవఱకు
పరుపులై వచ్చి యొడ్డున విరిగిపోవు
ఈ యనంతనైల్యమ్ము తా నిచట నిచట
తెల్లని కరళ్ళలో వచ్చి తేలిపోవు.

ఈ యనంతశూన్యమును నైల్యించె నెవఁడు
ఆ మహానైల్యమును దిగంతావృతమయి
ముంచుకొను వార్ధిఁ బ్రతిఫలింపించె నెవఁడు
నన్ను నీ వార్ధితటి నిల్పినా డెవండు.

ఈ యనంతనైల్యమ్ము నా యీ శరీర
మందు వ్యాపించె నా జన్మమాది

౫౫

సుకము కాలమునందు వ్రాసికొని యెవరు
పుట్టిరో వారికి వసంతము సుమనోజ్ఞ
మైనఁ గాసిమ్ము నాకు నీ వన్న మేను
జలదరించును ఓయి! ఆషాఢజలద!

నిను మదీయగ్రామ వీథి పిలిపి శైవ
సాంధ్యతాండవ నూపురస్వనము లొలుకఁ
జేసితిని నీవు మింటికి క్షితికి నేను
కవులమైతిమి హృదయదుఃఖములు పాడ.

నీవు జగమునఁ జీకట్లు నిండఁజేయ
వెలుఁగు చొరరాని యింటిమూలలను ప్రాకి
ముసుఁగు దుప్పటిలోఁ గన్నుమూఁతపెట్టి
పొదలు పెనుచీఁకటిని శాంతి వెదకికొందు.

ఇది ప్రసవజన్మ మెత్తిన దిదియచాలు
నన్ను నవహైమనిగళ బంధములచేతఁ
దనయెడకు లాగికోఁబట్టు త్రాళ్ళఁగూడ
నేటికో నన్ను బంధించ నింత తివురు.

ఇది యొకఁడె బంధ మని మది నెంచికొంటిఁ
గాని యీ రెమ్మ యీ కొమ్మ దీనిచివర
పొలుచు చివురులు పిందెలుఁ పో యివెల్ల
నన్ను లాగఁజూచెడిని బంధములు వేసి.

సహజముగ ననతిక్రమణీయమైన
దైవమను నూర్ణనాభికృతమగు చెట్ట
వాగురఁ దగుల్కొని కృతమహాగసుఁడను
వెలికి లోనికిఁ గాక తపించు చుంటి.

౫౮

అసలు నడిసంద్రమందు గేహంబుకట్టి
యీ తుపానుల గని భీతి యేలపొంద
ఒక్కవేళ యీ వార్నిధి యుబికివచ్చి
నన్ను ముంచునే యని యనుకొన్న నేమి.

నాగృహము గుర్తుగా నున్న నావికులకుఁ
దొలుతరోజుల మనసులోఁ గలఁకెగాని
ఈ మహావార్ధి కదియు తుదా! మొదల గ
ణించుకో నొండు రెండు కన్నీటిబొట్లు.

ఇపుడు బిట్టుగ రేగెడు నీ తుపాను
క్రమముగాఁ దగ్గిపోవును కాక యేమి
చేయఁగల దూరకే పొంగి శిశిరమైన
కెరటములమీఁద నన్ను నూగించు నేమి!

ఎట్ట యెదురుగఁ దోఁచెను కొట్టవచ్చి
నట్లు కోసిన కొండకొమ్మనఁగ నీ శ
రత్సమయ కించి దసితనీరదము వాయు
పథముకడ దాఁకి తారకాపథము మిగిలి.

కొన్ను కొమ్మలలోనఁ జీఁకటులు ముదిరి
ముడులుపడి నేలపై రాలి పడినయట్లు
నీలచిక్కణములు చల్లనీడ లోలనై
మఱల నిట విశ్రమింపఁగ మనసుపుట్టు.

పొద వెలికివచ్చినట్టి లో నిదుర వోవు
శ్వాపదము కాలిగోరునా వరలు మొగిలు
చాటుబడి యర్ధవిస్పష్ట చంద్రరేఖ.
నా యెద సమాశ్రయించు పునారిరంస.

౫౯

ఈ విశాలము నందనోపేత మమృత
దంబు సుఖనిధి స్వర్గఖండంబు దీసి
మృదు హృదయమందు నేన నిర్మించుకొంటి
గడు నదివ్యవస్తువుల సంఘటన పరచి.

ఈ మయూనిర్మిత స్వర్గసీమయందు
నిఖిల వర్ణసుందరతర స్నిగ్ధమైన
హరిధనుఃఖండ ముదయించె నా ధనస్సు
చివరలును వానజల్లులచేతఁ గరగె.

నా స్వరుత్తమక్షేత్రసంతతులు రాజ
నాలు పండెను తొలివిత్తనాలు పండె.

౬౦

మన వివాహంబు కచ్చ్బోసినదిసూవె
సకియ ముగ్ధవిస్రబ్ధ యీ జన్నియావు
నియతభావుఁడనై యొడల్ నిమురఁబోన
నాయొడలు నాల్కతుద చాచి నాకఁజొచ్చె.

తరచి గిలకొట్టరాదును దరకమీఁగ
డలును చిద్రుపలై వెన్నయు, వెలలరాము
సుప్రసన్న నిత్యము లామెమూపు లట్లు
వికృతి రహితమే తత్ప్రకల్పిత పయస్సు.

ఉజ్ఝితౌఘ దివ్యమ్ములౌ నుభయసంధ్య
లను బరస్పరసేవావిలాస నేత్ర
లగు భవత్సితాపాంగ పయఃప్రవాహ
వీచికాసుఖస్తిమిత విలోచనుఁడను.

౬౧

కృత్తమహిష దితిప్రభవోన్మత్త మస్త
నిహితమై యసృగ్గ్లాఢోభిపిహితమై వ
లె శివభార్యాపదమ్ములు మసృణమయ్యె
మన యొసంగు పూజా కుంకుమమ్మువలన.

ఒడ్డిగిలఁబెట్టి కొడితీసి యుజ్జ్వలింపఁ
జేసిన ప్రదీపికాకాంతిఁ జీఁకటులును
పలపలై కపురారతి వెలుఁగులోనఁ
బొడలె జ్యోతిస్సులన దేవి పదనఖములు.

ఈ శరద్రాత్రి శైలకన్యా సుహాస
రంజితాత్మలము శివశిరస్సుమీఁద
సగము పిండిన చిన్నారి చందమామ
మొగిలుచాటున వెన్నెల మూసబోసె.

౬౨

వానకోయిలనై నేఁ బిపాసఁ దగిలి
వృతవినీలాబ్దమున నొక్క టెక్కవిచ్చి
ఎండ పలుచని పొర నొక్క యెలుకచాచి
పైకిఁ జూచుచు నుంటి నీ రాక వేచి.

అతి కృశీభూతమగు దేహయష్టితోడ
శారదాచ్ఛ నీరదముక్త జలకణంబ
వైన నీ వేగుదెంచి న న్నంటినావు
లేమ ! నీ వంటినట్టులే లేదు నాకు.

శిశిర మధుమాసములు గతించి కృషికులు పొ
లాలు దున్నిన నాగేఁటి చాలులందు
టెక్కలను చాచుకొని నీటిచుక్క వైన
నీ మృదుస్పర్శలో మేను సంచుకొందు.

౬3

ఈ చిఱుతముత్తియము చూచి యెల్లవారు
ఏ మహావారిరాశిలో నిది దొరకెను
ఏ మహాశుక్తి గర్భాన నిది జనించె
నను మహాశ్చర్యచేతస్కు లైరి దేవి!

శుక్తిగర్భమ్ము చేసిన సుకృత మేమొ
దివ్య రత్నపరీక్షకుల్ తేరిచూచి
ఇది మహాద్భుత మనిరి యే ద్వీపమందు
చిఱుతముత్తెము లిట్టివి యెఱుగ మనిరి.

మాక్తికాచ్ఛప్రభల్ చూచి మనుజు లెల్ల
స్వాతి తొలివాన చినుకెంతస్వచ్ఛ మనిరి
కాని తచ్ఛుక్తి గర్భసంకల్ప మేమొ
ఎఱుఁగినది స్వాతిచినుకొక్కఁడే! శుభాంగి!

౬౮

అస్మదంతర సంభూతమైన కోప
మనెడు వహ్నిక విసరితి నామెమీఁద
ఆమెయును నోర్పుతోఁ గాలినంత కాలి
ఎంత కటికతనమ్మసి యుడిసిపోయె.

కడగి నా యెద నిండి పొంగారు ప్రేమ
పూర మాయమ మూర్తిపై ధారపట్టి
క్రుమ్మరించితి నామె నర్ణ గుచ్చియెత్తి
నీ హృదయ మెంత చిక్కణనిభృత మసియె.

ఒక మహాసంస్కృతి ఫలంబు నొందువేళఁ
దలఁతు నామె నా కాలిసంకెల యటంచు
ఒక మహాసంస్పృతి ఫలంబు నొందువేళ
మచ్ఛిరస్థ పూజాకుసుమం బటంచు.

౩౯

కరములందునఁ గరములు కలిపివైచి
ఇట్టె మనమిర్వురము చెట్టు కట్టినాము
చిగురునఁ గొసాకులోఁ జిన్నిచిన్నిపూలు
కాయలును పిందెలును బూచి కాచినాము.

ఈ తరువునందుఁ జివురులు లేఁత లేఁత
పూపమొగ్గలు తావులు బుగులుకొన్న
పువ్వులుగ నన్నుఁ జేసి నీవు తరులగ్న
కంట కాకృతివైతివి కరుణమూర్తి!

## ౬౬

సిరత మీఁకొండయంచుల దొరలివచ్చు
నె త్తిపోతల వేగాన నెగురు నీమ
హాంబుశీకర సంతాన మాకసమునఁ
జిఱుత కొ్రివ్వాన జల్లుతుంపురులవోలె.

తుంపురుల జల్లులందుఁ ద్విషాంపతి ఘృణు
లొలసి కిర్మీరితంబైన వ్యోమసీమ
నైంద్ర కార్ముకఖండ సహస్రమొప్పి
చివురుతొడిగెను మింట మాఘవతలక్ష్మి.

నీటిజల్లు తుంపురుల పందిరులలోన
ఇంద్రధనువుల తోరణా లెగురుచున్న
పెండ్లిపందిరి నన్ను భావించుకొనుచు
నాయొడలె నాకుఁ వెలియ దీనాటి పగలు.

౬౭

ప్రతిదినమ్మును సాయంసరాగరమ్య
జలధరచ్ఛాయలందున నిలచియుండి
అదియ మఱి మఱి యనిపింతు నామె చేత
నేను నిన్నె ప్రేమించుచున్నా నటంచు.

మా చిఱుతకంపముల హాసమ్ముఖోచితంపు
నెలపొడుపు లేఁత పలుచ వెన్నెల చివుళ్ళ
లోన మా ప్రేమ నిశ్చితంబైన యదియ
ఈవిధి దినమ్మునసపించు టిల నేను.

ఆపలుకులోన నెప్పటిదో పురాను
భవ మొకండు మనఃపథిఁ బ్రాఁకులాడి
యిదిగదా నన్నిటుల ముక్తిపదము త్రోవ
వెలయఁ జేసినదని యనిపించుచుండు.

నేను మాయమ్మయొడిలోన నింతవాడ
నైన యపుడు నాలోన నీయఖిలమిమిడి
యుండెఁగావలె నేటి కి ట్లుబికివచ్చి
చిత్ర చిత్రభావాకృతుల్ చెలువుమిగిలె.

పాడుటకు మున్ను కంఠగర్భమున నెఱుఁగ
రాక యవ్యక్తమై యున్న రాగమట్లు
నిభృత చిక్కణమూర్తులు నీవు నిసువు
లిన్ని సుఖములుదాగినా రెటులదేవి!

అస్మదీయ హృదబ్జనాళాంతరమున
బీజరూపమ్ముగానుండి విశ్వమింత
ఇది బహిర్గతమగుదాఁక యెఱుఁగలేన
అంతయవ్యక్త శిశుమూర్తినైతి నెట్లు ?

౬౯

ఇవి యథా కంఠనిర్గతం బవి తథావి
లిఖితములు ప్రేమగీతముల్ దేవి! నీ య
పాంగ రేఖాచల న్మందహాస వాహి
నీ తరంగాల నాదుగుండియ చలించి

ఈ విశాల కృష్ణాతటి నీ విలాస
మృదుశబల శారదాంబు సంపదలఁ గదలు
లాడు జమిలి నావలకు సామ్యము కుదుర్తు
నీ ప్రశాంతాస్మ దుభయమూర్తి ప్రథలకు.

ఇది విచిత్రమ్ము నాకు నాకే మదీయ
హృదయమున నన్ను నే ప్రతిష్ఠించుకొనుచు
స్నిగ్ధ దేవతామూర్తిని సేవ పూజ
చేసికొందు నన్ను వరలక్ష్మిదయితుని.

౭౦

ఈ యనంత ప్రయాణమ్ము నేగుచుంటి
నా! ప్రతి మలుపునందు నీవై యిదె కను
మింత దూరమ్ము వచ్చినా వీవటంచు
జ్ఞాపకము నాకు చేయుచున్నావు దేవి!

ప్రతి మలుపునందునుం జానపదుల బాల
వలె నసంస్కృతములు రాగివైన కేశ
ములును నివ్వెఱవోవు దృక్కులును ధూ
ళిహిత దేహమ్ముతోడఁ గన్పించుచుంటి.

కనులఁ బొడిచితి వీ యనాగరకజాన
పద కుమారికామూర్తివి ప్రథమమందు
నేను నివ్వెఱవోతి నూహించుకోలేఁది
నా కనుగొలంకు నిండుచున్నది జలాన.

౭౧

ఇది ప్రతినవపూసితిన ప్రవాహింపఁజేతు
ని యడుగుదమ్ములందు ననేక నాక
వాహినులు వాసి నీరముల్ ప్రాశనమ్ము
గాఁగ భావ్యాంధ్రదేశ సత్కవుల కెల్ల.

మధుర హైమచ్ఛదాభిరామయును మదవ
తీరణన్నూపుర క్రేంకృతి ప్రశస్త
కూజితయు నైన హంసిపైఁ గూరుచుండి
భావి శారదామూర్తివి ప్రజ్వలింతు.

ఆ సరస్వతి నిన్ను జిహ్వాగ్రసీమఁ
దాండవింపించినట్టి విధాతృమూర్తి
నన్ను నాసృష్టి నేమియనంగ గలరొ
మన శిశువులైన భావిసంపన్న కవులు.

౭౨

అమృతకిరణహాసో నాథుఁడైన యపుడు
నీ చెవుల నూదుచుండు ననేక ప్రేమ
గీతములు నీవు విని యరమూత కనులఁ
బ్రతి పరిణయగీతమున కనుమతి నొసగెదు.

నేను వినిపించుచునె యుందు నీ కనులవి
మొగ్గలను బోలె నిదురలో మూఁతపడును
ఆ పరిణయగీతి యానాటి కనుమతింపఁ
బడక మరునాటికై యాపఁబడును దేవి!

శరదమల మేఘమగు నాకసంపు సరసి
శాంతమై తేలియాడెడు చందమామఁ
బోలె నేకదృక్కులను నీమోముకనుచుఁ
గనుచు నేను నిదురపోదుఁగా వలయును.

౭౩

'బాపిబావ' లేఖయొకండు వ్రాసినాడు
నేను ముక్తాచ్ఛహారమధ్యాన వెలయు
హారి వినీలనాయకమణి నంట సితస
రః ప్రదేశ లోలేందీవరంబు నంట.

అతఁడు మధువాక్కునగు పరిహాసకాఁడు
కించిదరుణ కపోలము కెలని పుట్టు
మచ్చ నఁట శకస్త్రీకుచమండలమునఁ
గరగుటకు సిగ్గువడు చూచుకంబు నంట.

హారిమణీందీవరమ్ములు నచ్చమైన
పుట్టుమచ్చయుఁ జూచుకమ్ము నివి నేనె
ఆ శబల వర్ణవర్ణితమ్మైన దేదొ!

౭౪

ఊహాపై నూహ లల్లి నే నొక్కరుండ
నున్నయప్పుడు బంగారు చిన్న మేడ
బురుజు లొక్కటియా! సర్వమును మహాంధ
కారమున భావవీధిలోఁ గట్టుచుంటి.

ఆ విలాసైకరమ్య సౌధాగ్రసీమఁ
బైడిగొలుసుల యుయ్యాల పట్టిమంచ
మందున సుఖైకతల్పుఁడనై మహాంధ
కారమున సుఖస్వప్నముల్ గాంచుచుంటి.

బహుళజన్మాత్త సంస్కారభద్రమైన
ఒక వెలుఁగు నాహృదుంటెలో నొదిగియుండె
ఆ వెలుఁగు సోకి నామేడయంత కరగి
పడతి! నే సింతలో దిశాంబరుఁడ నైతి.

౭౫

ఒక్కయప్పు డీ మేను మహోన్నతంపు
పర్వతమువోలె మిక్కిలి భార మగును
మఱియొకప్పుడు నవసుకుమార కుసుమ
సదృశమై గాలిపొరలలో జారిపోవు.

అది మహాపర్వతమువోలె నమితభార
మైన వేళల నాకు భయంబులేదు
గాలిలోఁ బూవురేకునుబోలె నెగురు
వేళ నాయాత్మ యిది భయావిష్ట మగును.

ఉండి యుండి యే వేళనో ఒక్కమరణ
మనుచు లేక యెద్దో రుజ యనుచు లేక
కప్పురమువోలె నీ మేను కరగిపోయి
చనునో యే నిద్రయో మేలుకొనఁగఁబడక

౭౬

పలుకరాని జ్యోతిస్సు నా ప్రణయ మెల్లఁ
గావ్యరూపమ్ముగా నిట్లుకరుగఁబోసి
ప్రళయకాల నిగూఢగర్భమ్మునందు
దీని యాకృతిఁగూర్చి చింతించు చుంటి.

ఈ మహాద్వైతభావమిదింత కుదిరి
కుదురనీయద యేలో నా హృదయశాంతి
ఈ సుకావ్యాకృతిం గుదియించివైచి
దివ్యమగు జ్యోతిగా సమర్థింప నెంతు.

విగతతృష్ణుస నన్నింత వెక్కిరించు
నీ మహాతృష్ణ

౨౨

ప్రకృతిసిద్ధమ్ముగా నాకు వర్షఋతువు
చరమసంధ్యలు నవి మనోజ్ఞమున కెక్కు
నా మనస్సు సమ్మర్దజనమ్ము నెడలి
హృదయ కుహరమ్ములో శాంతి వెదకికొనును.

ఉదయసంధ్యలకన్న నా కూహసేయ
గాఁ జరమసంధ్యలే భావగర్భితములు
గాఁ గనంబడు నీ మొగిల్ కడల మెరసి
కనకగిరిసానువులఁబోలెఁ గానిపించు.

౭౮

శ్రీ మధురమూర్తులును చిరంజీవులైన
యట్టి వత్సలాసౌభద్రు లమృతపరిణయ
వారిరాశిని పుడిసిటఁ బట్టినారు
ఎఱిఁగిన జనమ్ము నిన్నోఱయే భజింప.

నిభృత మస్మద్ధృదబ్జమ్ము నిండియున్న
పరిణయతేజ మా పుణ్యదంపతులయెడల
సాభిలాషమై వాక్ప్రవాహములు కట్టె
నమృతమయములు స్నిగ్ధభావాలసములు.

అతిపవిత్రమ్ము యగు పరిణయమ్ము నెడల
నింత సుస్నిగ్ధుఁడైన నన్నిపు నూత్న
మధుర మధుర కటాక్షసంపదలఁ జూచి
నన్ను దివ్యునిఁ జేయుచున్నావు నరుని.

౭౯

మధుమధుర మంజువర్ణ గుంఫనము కల్గి
ప్రకృతి దివ్యార్థ సూచ్యభావమ్ము కలిగి
పరగు కల్యాణిపైఁ బాడఁబడిన తెలుఁగు
పాటయొక్కటి నీదు రూపముగ మారె.

ఈ సుకవినైన నా జన్మ మెల్ల దేవి!
అచ్చఁపుఁ దెలుంగుపడఁతి వైనట్టి నిన్ను
మఱల నా తేనెపాటగాఁ గనఁగఁబోయఁ
ద్వత్పదార్పితమ్ముగ నేను ధారవోతు.

౮౦

నాకు నక్షత్రముల దర్శనంబువలన
నీ పవిత్రనిశావేళ నిరిసిపోయె
హృదయపద్మంబు పాపభూయిష్ఠమును తీవ్రు
ధాభిభూతమ్ము నా బ్రదు కరయుకోలఁది.

పాలఁతి మనపెండ్లి కఁట సాక్షిభూతుఁడైన
గార్హపత్యాగ్ని మఱల నా కరమువెంట
నక్షతలచేత హవ్యకవ్యములచేత
నర్చితుఁడు కానెలేద యే మనఁగవలయు.

మూఁడువహ్నులు నర్చితంబులుగఁ బొందఁ
దగిన వఁటవె! సావిత్రివర్తంబునందు
మెఱయు తారకాపదముల మేలిస్థితులు

౮౧

శివజటాకృతి శ్యామలచ్ఛవిఁ దనర్చి
కోసదేరి యీ సుస్నిగ్ధకోమలంబు
నవజలదమూర్తి చరమసంధ్యను శిరస్థ
తరుణ శశిరేఖచేఁ బవిత్రంబొనర్చు.

చరమసంధ్యయుఁబలె ఫాలచంద్రరేఖ
నీలజలదకేశ ప్రసూనజాలమధుర
మూర్తి మత్కులపాలిక ముగ్ధహృదయ
ఈ చరమసంధ్య నన్నె యూహించుచుండె.

౮౨

నీవు వేసంగినదివోలె నీ జనుస్స
లాని కేగితి సాగరుంబోని నేను
కల్పితోహ తరంగలం గదలి కదలి
మఱల మఱల నాలో నేనె తిరుగంబడుదు.

సాధు జలసరిత్సాగర సంగమమ్ము
వోని మన నాటికలయికలోని నాదు
నాక్రమణ నీదు నోదుగుట యందమైన
యీ నిశావేళ నేను నూహించుచుంటి.

౮౩

ఈ మధురపూర్ణిమా యామినీ మనోజ్ఞ
వేళలో నీవు పరచినవెల్ల సెజ్జ
పైనఁబడుకొని మీలితమ్మైన లోచ
నములతో నిన్నె మనసులోనఁ గనుచుంటి.

ఇంతలో నాపయినఁ బుష్పవృష్టి కురిసె
నవ్యమృదుమల్లికా వాసనాతరంగ
గుమ్ము మని వచ్చి నా హృదయమ్ముదాఁక
నాచికొన్నది ఘ్రాణేంద్రియ ప్రవృత్తి.

కనులు తెరచితి నీ ముగ్ధకరమునుండి
నాపయినఁ బూలురాలుచున్నవి విముగ్ధ
హృదయుఁడను రాలుచున్న పూలేరి పొదివి
కొంటెఁ గవుఁగింట ముద్దిడుకొంటెఁ బెదవి.

ఇదియు మార్గశీర్షపు శుక్ల విదియ హైమ
శైలతనయా హృదీశ్వరమౌళి కృత మ
హాభిషేక శైత్యమ్ముల నపుడె విరియఁ
జల్ల మొదలిడె నీ బాలచంద్రరేఖ.

తన్నికట దేశసంస్థిత తారకా వి
ముగ్ధమోహన రేఖలో ముడుతలు పడి
నాదృగంతమ్ము కుంచుకున్నది దిగంత
రములయందు నిదేమి శైత్యములు గ్రుక్క.

ఈ మహాశీతమునయందు నేను నాకు
గళవిలీన స్వరమున గద్గదిక వొడము
నస్మదీయ దేహమున రోమాంచమొదవుఁ
జలితలోచనముల బాష్పములు స్రవించు.

౮౫

మఱలఁజూడు నవాషాఢ మరుగుదెంచెఁ
దరుణ చిక్కణ శ్యామలాబ్దములతోడ
మఱల మేఘుని యొడలు శంపా ప్రగాఢ
ఘన పరిష్వంగములయందుఁ గాంతిపొందు.

అస్మదీయ వినీలదేహమ్ము కూడ
మత్కలాంగనా బాహుహైమచ్ఛవి సుప
రివృత మయి రమ్యమోహనాకృతి వహించు
నన్ను నక్క సిగ్గు పుచ్చుచున్నదియుఁగూడ.

నాకు శంపాలతాంగి సౌందర్యరాశి
నన్నుఁజూచి యీ శంప సౌందర్యమూర్తి
వనుచు నగి పరిష్వంగించు.

ఓయి ఆషాఢజలదుఁడ! ఓయి!! నీకు
నాకు సామ్యమ్ము కలదు విన్నావటయ్య
నావలెనె నీవును గులాంగనను గుఱించి
ప్రణయ సుకుమారగీతముల్ పాడుచుందు.

నీ మధురగీతములు విని నేలయందుఁ
బులకలునుబోలెఁ బచ్చనిమొలక లెత్తు
నా మధురగీతములును విన్నట్టివారి
ముగ్ధహృదయాలు క్రొంగ్రొత్తమోసు లెత్తు.

నీ యురుము విప్రలబ్ధలౌ నెలఁతుకలను
గళవళింపించు నట్లె నా కమ్రగీతి
కలును నసధర్ములకు బాధ కలుగఁజేయు
ఓయి నీవలె నీలదేహుఁడను నేను.

౮౭

నీవు నా మనస్సున నిల్చినావు దేవి!
నా మనసు లోతులును శారదామనోజ్ఞ
చరణమంజీర నికషరంజత్క్వణాంక
వలితములు నా ప్రణయగీతి వంపుతిరిగి.

నీవు నాగుండెఁ గదలించినావు దేవి!
దేవి! తత్రత్యు లగు సర్వదేవతలును
అనభిహూతములు హవ్యకవ్యములు పొంది
నా యకర్మిష్ఠిత క్షమించినారు దేవి!

నీవు నామేనఁ బెనవడినావు దేవి!
నా తనూలతపైన మాన్మథవిలాస
చిహ్నములు తోఁచి నా దీర్ఘజీవితమ్ము
మన పరస్పర ప్రణయాంకమును వహించు.

తత పురాకృత కర్మానుగతి మదీయ
భాగ్యము వినిర్ణయముచేయు బ్రహ్మముదల
ననుసరించిరి నాకు పిత్రాదు లగ్ని
సాక్షికంబుగ నిన్ను నా చానఁజేసి.

అస్మదీయ పురాకృతమైన పుణ్య
మింత యని యిట్టి దని నాకు నెఱుఁగఁబడని
వేళలో నీవు మత్కంఠవిదళన క్రి
యార్థ కల్పితశిల వని యాడుకొంటి.

కర్మసిద్ధాంత మవగతగతిఁ జరించి
నా సుకృత మూర్జిత మ్మన్న జ్ఞాన మొదవి
ఈ మహానంద కృత్స్న స్వర్ధామ మంజ
లి ప్రణీత మందాకిని శ్లేషణింతు.

౮౯

మన్మనోజ్ఞ తనూ వినిర్మాణకలిత
భూత పంచీకరణవేళ మొగ్గుపడి ర
సమ్ము కావలెఁ గాక యాషాఢగతున
కంబుదున కేల నా హృదయంబు కరగు.

ఈ జలము డింతయును మున్నె యెన్నొ పొందెఁ
గానుకలు మద్గిరాంవీధికలఁ జరించి
ఇతని కార్ద్రిఁడనైన నా హృదయపుటము
వీఁ డెఱేఁగ నేను మఱి మఱి వెంబడించు.

మున్ను నర్తనశాలాభిముఖుఁడనై మ
హాంధతామిస్ర శర్వరియందుఁ గీచ
కుండ నయి పిసలోన లీనుండ నైతి
మఱలఁ దనలోనఁ గలుపుకోఁ దరుమఁజొచ్చె.

౯౦

ఈ ప్రణయగీతి మును పల్కరించినంత
నాయెడ మహానురక్తయునాఁ బరువులు
పెట్టి వచ్చెడి దిప్పుడు పిలచి పిలచి
నాగళము సన్నవోవుచున్నదియుఁగూడ.

మనము నూత్న నూత్న ప్రణయాంబునిధులందు
ముగ్ధులము సచేలస్నానములు పొనర్చు
తఱిసి బహుధాభిలషిత భేదప్రవాహ
మందు నాగీతి పొంగెడి దబ్ధివోలె.

ఇప్పుడు ప్రశాంతసంసార మిద్దఱమును
నీవు నే నయి నేనును నీవు నైప
రస్పరహృదంతరాళ విశ్రాంతి పొందు
వేళ నే మయ్యె నాగొంతు పిలచి పిలచి.

౮౧

నీవు తొలినాఁడు నా మనోఽభృతవీధి
జన్మజన్మాంతర పునీతసంస్క్రియా ప్ర
ణీత మానందశకలము నీ మనో జ
లేజ సంస్పర్శకలిమి వెల్గించినావు.

అది క్రమ క్రమ వర్ధితమై దిశాంత
రములు రోదసీకుహర మాక్రమణచేసి
సరగ నా నాగపదత్రివిష్టపము పెరిగి
నైకతారకాపథములదాఁక పోయి.

ఈ యనంతవృద్ధికి విసుగెత్తి తుదకుఁ
గుంచుకొని కుంచుకొని వినిగూఢ మస్మ
దంతరాత్మ ప్రవిష్టమై యుండె మఱలఁ
దొల్లిఁటానందశకలమై తొంగలించు.

౯౨

మార్గశీర్షాంతవేళ గుమ్మడులు పూచి
యీ యుషఃకన్యకను నలంకృతులు సేయ
మొగమునను లాగికొన్న దీ ముద్దరాలు
మిహికపుఁ సన్న ముత్యాల మేలిముసుఁగు.

నా పువ్వుందోఁటలో లతాంతములు వదలి
కోరడులయందుఁ బూచిన గుమ్మడులనె
పిలుకడలు చేసికొని కౌఁగిళులు వదలవు
తేంట్లు జంపతు లింతగాఁ దెల్లవారి.

మంచుదమ్మిన నాపోవు మార్గపార్శ్వ
కముల లతికాసతులు నన్నుఁ గౌఁగిలించి
నా మొగలు జల్లు మనిపించినవి విలోచ
నార్ద్రమాలన సౌఖ్యమ్ము లావహించి.

౯3

సగము మేఘావృతమ్మయి సగము హరిణ
లాంఛన మనోజ్ఞ శిశిరవిలాస చంద్రి
కావృతమ్మయి యీ వ్యోమ మతివ! మనము
కౌఁగిటం గ్రమ్మికొని యున్నకరణిఁబోలుచు.

ఈ జలదమాల వ్యాపించి యీ శశాంక
కలిత గగనార్ధభాగమ్ముఁ గ్రమ్మ నేను
ప్రేయసీ! నిన్నును ముసుఁగుపిహితవదన
నాక్రమించుకొన్నట్లుగా నవఘళించు.

దివ్యగంగాధునీ పరిదీప్త మంబు
ధర సమాక్రాంతము శశాంక తరుణచంద్రి
కావృత మిమ్మ వియత్పథ మస్మదీయ
ప్రణయచారిత్ర మఖిలమ్ము ప్రతిఫలించు.

౯౮

ఒక మహాగాథమును శిశిరోజ్జ్వలంబు
నగు నెదో పరిష్వంగమునందు మనల
పాణిపంచక యుగళమ్ము వాంఛసేతు
దేవి! దశధాప్రతున్నంబు కావలె నని.

అప్పు డా సత్యన స్స్వభిన్నాత్మల మయి
వెలఁది! యీనాఁటి మన ప్రేమబలముచేత
మన భవిష్యత్ప్రజా సుకుమారహృదయ
ప్రణయచరితముల్ పాలించవలయు ననియు.

౭౫

నీ పరిశాంతాచ్ఛ నిస్తరంగప్రణయ ప
యస్సుధారాశిలోపల నస్మదీయ
ముజ్జ్వలప్రేమ నౌకము నున్నచోట
నున్నయట్లుగఁ గదలకయుండె దేవి!

అదియు నిర్వీచి నిర్వాయి నస్మదీయ
నౌక యీయొడ్డు పట్టుకొన్నది సమీర
మొక్కపొర లేదు తెరచాప లూది యూది
చిన్ని గాలిపొరల్ కదల్చితిని నేను.

బహుప్రయాసమ్ముపడి పరవళ్ళుత్రొక్కు
నిస్తరంగ భవత్ప్రేమ నీరరాశిఁ
జిన్నరితరంగచాలు సృజించినాను
చిన్ని నా నౌక యా యొడ్డు చేరుటకును.

౯౬

లలితశృంగార మధుమాస లక్ష్మివైన
నీ విలాసైక పాదచిహ్నితమసుమ్మ
నాయెడఁద పూవుతోఁట యనంతకోటి
గాసుమ పరిమళముల శ్లాఘ్యతవహించు.

ఆ పువుందోఁటను బికమ్మ నైన నా సు
మధుర పంచమగీతిలో మణగియుంటి
మీ పువుందోఁటతోఁగూడ నీవు నేను
సకలమైనట్టి యీ ప్రపంచకముతోడ.

అందు నిది యున్న దనుచు లే దనుచు లేక
యున్న దని యుండిలే దని యిన్నిగతుల
రమ్యమద్గీత మిది పరబ్రహ్మమోలె
నీ యతికృపచేత విచారణీయమయ్యె.

౯౭

నీపయిన నేను పాట లెన్నియొ రచించి
యీ మృదులవీణమీఁద వాయించుకొనుచు
వాడవాడలఁ దిరుగుచున్నాఁడ నన్ను
నేరునుం బల్కరించినవారు లేరు.

అలసి యీ వీణ తలక్రింద నవధరించి
నిదురపోదున ఎండ మండిపడు నేస
వీణ యిది నెత్తి కడ్డము పెట్టుకొందు
నొలయు వానలు దీనితో నొడ్డుకొందు.

నీపయిన నిన్ని గీతముల్ నిర్ణయించి
పలుకు నీ వీణ యెండకు వాన కిట్లు
చివికిపోయి యే నాఁటికో శిథిలమైన
నది పలికినట్టి పాట లేమౌనో కాన.

౯౮

మన పరస్పరప్రేమ సంబంధ మింత
దృఢతరం బౌటకును హేత మేమొ యంచుఁ
గారణము లోక్క టొకటిగా నేరితెచ్చి
తొలుత తొలుతనె కాదని త్రోసిపుత్తు.

పాప మిట్లు నిరాకరింపఁబడికూడ
నాయెడల నిత్యమును బ్రసన్నము లెసుమ్మ
నీదు సౌందర్యశీలముల్ నీ కులీన
తయును నీ యిట్టిదగు నగాధంపుఁబ్రేమ.

ఇన్నినాళ్ళకుఁ దెలిసిన దీ ప్రణయఁపు
సుదృఢబంధకారణము నా యెద విధేయ
మై పసితనంపునాఁటి పిత్రాజ్ఞ నెంచి
జనని యనుమతి గని భక్తి వినత మయ్యె.

అమృత తరుపల్లవాభిరామార్ద్రమూర్తి!
నీ కృపావేశమునఁ జేసి నీ పదాంబు
జముల మ్రోగిన నా గానజనితరవము
వినఁబడియెఁ బ్రేమవాహినీవీధులందు.

అమితశృంగార రసవీధులందు నీకు
నవవసంతోత్సవంబులే చివురుఁబోఁడి!
ప్రణయసోపానముల నిలంబడి మదీయ
భావకన్యక నీకు నివ్వాళిపట్టు.

ఈ నవమధూదయపు వేళ నింతి! నిన్నుఁ
బ్రణయకోమల మాకందపాదపమ్ము
శీతలచ్ఛాయలందు వసింపఁ జేసి
ముగ్ధభావ ప్రసూనాలు పూజలిత్తు.

౧౦౦

మొగిలుచాటు శరజ్జ్యోత్స్న మొగిఁ బిశంగ
రుచులు వెదజల్లుపథముల విచికిలార్ద్రి
గంధి! వలిపంపు పండుచెంగావిచీర
పై విలోచనాంతాంజనప్రభలు పర్వి.

వచ్చి నీ మే నొకేసారి వార్షికాభ్ర
లీన సౌదామనీపింగలిమము నంగు
లీ విలూన జపాపాటలిమము చలద
లీ గరున్మోహనశ్యామలిమము తన్వి!

నవనవ సరస్వతీ యమునా భగీర
థాత్మజా వేణికాపూత యగు ప్రయాగ
వోలె సత్త్వరజ స్తమో భూరిగుణ స
నాథశాంకరివోలె నందగిలె దీవు.

౧౦౧

పడఁతి! నీ ప్రేమదారుల నడచి నడచి
పూవుల బజారులందునఁ బోయినట్లు
నవనవ పరిమళ త్రనూ నవ్యతా మ
నోజ్ఞమూర్తిగ నెంచుకొందును లతాంగి.

తరుణి! మన్మన ఇంద్రియద్వారముఖ భ
వత్ప్రవేశ వాంఛాలవేషప్రచలిత
మైన నా యాత్మఁ జొచ్చు నీ యమృతవాస
నాసలమ్ములు పోసికొన్నని పురంధ్రి!

నా సొగసుటింటఁ జిన్ని రత్నంపుదీప
మిడికొనినరీతిఁ పదును చేయించుకొన్న
నాదుపొలమున సురగంగ బోదె క్రొదుగు
లీల నా యాత్మ నీవు వెల్గించినావు.

౧౦౨

తుంగగిరిసానువుల మహాద్రితతరంగ
మీా గిరికుమారకుని ప్రేమ వేగ మిదియు
ఆనకట్టల కొగ్గ నీయుంమఁ జేసి
సింత చిఱువాకలై ప్రవహించె చూడు.

పలుకడలుపడ్డ యా ప్రేమ కొలఁకులకును
కెలఁకులను బూచె శతపత్ర మలఘుతరము
ముగ్ధరమ్యమ్ము కానుక పుష్పకొమ్ము
కోసి తెచ్చితి దీని నీకొఱకు నేడు.

ఇది సభక్తిక మర్పిత మిది భవచ్ఛి
రంబునను నీదు మోముపై వ్రాలి దేవి!
శారదాభాల బాలశశాంక రేఖ
వలెఁ జెలంగె నా పూర్వతపస్సుచేత.